# శ్రీఆంజనేయా! అభయప్రదాతా!



శ్లో॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణు శివాత్మకమ్
తరుణార్క సదృశాభాసం రామదూతం నమామ్యహమ్ ॥

రచయిత - సంకలనకర్త
**మండపాక ఆంజనేయమూర్తి**
ఆర్. అగ్రహారం, గుంటూరు-3

# 'గురుశక్తి అమృతధార'



మొదటి గురువు
మాతృమూర్తి



రెండవ గురువు
పితృదేవులు



మాతృ - గురు స్వరూపి



గాయత్రిమంత్రదీక్ష
అనుగ్రహించిన సోదరులు



మొదటి క్రియ



రెండవ క్రియ

క్రియాయోగ దీక్షా గురువులు

# శ్రీఆంజనేయా! అభయప్రదాతా!




శ్లో॥ మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్।
వాతాత్మజం వానరయూథ ముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి॥

రచయిత - సంకలనకర్త
**మండపాక ఆంజనేయమూర్తి**
ఆర్. అగ్రహారం, గుంటూరు-3

సర్వస్వామ్యములు: రచయితవి
ప్రథమ ముద్రణము: హనుమద్వ్రతం (23 డిశంబర్ 2015)
ఆవిష్కరణ: శ్రీజపాలిహనుమాన్ క్షేత్రం, తిరుమల (శ్రీఆంజనేయస్వామి జన్మస్థలం)
ప్రతులు : 2000

ముఖచిత్రం: **పంచముఖ ఆంజనేయస్వామి వారు**

మూల్యము: **పరమభక్తి తోకూడిన రూ.11 కైంకర్యం**

ప్రచురణ: **రచయిత**

ప్రతులకు :
**మండపాక ఆంజనేయమూర్తి**
శ్రీపరమహంస సదనమ్ (డోర్ నం.24-4-29)
శ్రీలక్ష్మీనరసింహస్వామి దేవాలయం వద్ద
ఆర్. అగ్రహారం, గుంటూరు - 522 003
సెల్: 9700915122, 9949252230

**M.APPALANARASIMHAM**
Branch Post Master
**MEDIVADA** (BO)
Ravikamatham-531025 Vizag Dist.
Cell: 8297488288.

**Sri M. JOGIRAJU**
C/o AVS Anand, **B 203**,
Jeevan Visakha Apart.
**MMTC Colony,**
Visakhapatnam-530022

డి.టి.పి.: **శ్రీ ఆంజనేయ అసోసియేట్స్**
గుంటూరు 7794945941
ముద్రణ: **వినయ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
విశాఖపట్నం-20, 8897905461

# శ్రీఆంజనేయుని ఎందుకు పూజించాలి?

**డా॥ శ్రీమత్తిరుమల వేంకట రాజగోపాలాచార్యులు**
**సంపాదకులు-గోవిందప్రియ**

మానవ జీవన పరమార్థం మోక్షం. అయితే భోగములు ఉన్నచోట మోక్షం లేదు. మోక్షమున్నచోట భోగం లేదు. మనిషికి ఇహ-పరాలు రెండూ కావాలి. సకల కోరికలు తీరి భోగ మోక్షాలు రెండూ సిద్ధించాలంటే శ్రీఆంజనేయ స్వామి ఉపాసన, పూజ, అర్చన చేసేవారికి మాత్రమే సాధ్యం. సమస్తం శ్రీఆంజనేయస్వామివారి అధీనం. **"యత్రాస్తి భోగోనహితత్రమోక్షో యత్రాస్తి మోక్షో నహితత్రభోగః। శ్రీమారుతేస్సేవసేన తచ్చరణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ॥"** హనుమంతుని పూజిస్తే సర్వదేవతలను పూజించినట్లే అంటాడు పరమేశ్వరుడు పార్వతితో. **"ఆంజనేయః పూజితశ్చేత్ పూజితాస్సర్వదేవతాః"** హనుమన్నామ జపం చేసేవారికి ఏవిధమైన భయం కలుగదు. హనుమ **"అభయ ప్రదాత"**. కనుక హనుమను పూజించాలి.

బాల - వీర - ధీర - శూర - దూత - పూత - దాన - భక్తి - నమ్ర - క్రమ - సత్త్వ - తత్త్వ - ప్రసన్న - సంజీవనీనగధర రూపాల్లో ఉపాసించబడుతూ భక్తుల పూజలందుకొనే ఆంజనేయస్వామి ఆయా భక్తకోటి

అభీష్టాలను సిద్ధింప చేస్తూ వారి త్రికరణములలో సత్యసంపదను అనుగ్రహిస్తాడు. హనుమన్నామ స్మరణ మాత్రమున బుద్ధి, బలం, యశస్సు, ధైర్యం, నిర్భయత్వం, రోగరాహిత్యం, అజాడ్యం, వాక్పటుత్వం కలుగుతాయని ఆర్యోక్తి. మనిషిగా పుట్టినవానికి ఇంతకంటె ఇంకేమి కావాలి కనుక! ప్రాపంచిక వస్తు వ్యామోహం లేకపోవటం, విద్యను పట్టుదలతో అభ్యసించటం, ఎదుటివ్యక్తితో మాట్లాడవలసిన తీరు, ఆర్తత్రాణ పరాయణత్వం, విఘ్నాలు కలుగుతున్నా కార్యసాధన కావించటం - ఇలా ఎన్నో ఉత్తమ ఆదర్శ గుణాలనిధి ఆంజనేయుని జీవితం. అంతేకాదు జీవ-పరమాత్మల అనుసంధాన మార్గదర్శక ఆచార్యుడు ఆంజనేయుడు కనుకనే ఆంజనేయుని పూజించాలి, సదాచార్యునిగా ఆరాధించాలి.

శ్రీఆంజనేయస్వామి మహిమను తెలియటం బ్రహ్మాదులకైన సాధ్యం కాదు. మరి తెలియటం ఎలా? ఆస్వామి కృపావలోకనం వల్లనే సాధ్యమౌతుంది. ఆ ఆంజనేయస్వామియే తనను పంచప్రాణాలుగా భావించి ఆరాధించే శ్రీమండపాక ఆంజనేయమూర్తిలో ఆవహించి బహు గ్రంథసారభూత నవనీతంలా, ఆర్తుల కరస్థ కల్పవృక్షంలా, సూక్ష్మంలో మోక్షంలా భక్తకోటికి ఈ చిరుపొత్తం అందిస్తున్నారని నా భావన. ఐకమత్య బల సందేశాన్నిచ్చే సూక్తంతో కూడిన శ్రీహనుమ

సమగ్ర పూజావిధానాన్ని అందిస్తున్న జేబున ఇమిడే చిన్న పుస్తకం ఇది. తప్పక చదవండి. మీ బంధుమిత్రులచే చదివించండి

శ్రీహనుమచ్చరితామృతసార సంగ్రహమైన ఈపుస్తకంలో ఆంజనేయుని నవావతారస్వరూపం, పంచముఖాంజనేయుని ప్రార్థన, హనుమద్వ్రత విధానం, రుద్రాంశతత్త్వం. ఓంకార రూపం, పూజావిధానం, వానరగీత, అష్టోత్తరశత నామాలు క్లుప్తంగా సుందరంగా ఇవ్వబడ్డాయి. ఆంజనేయుని అనుగ్రహం పొందాలంటే ఏమిచేయాలో ఎలా పూజించాలో ఎలా స్మరించాలో, ఎలాజపించాలో కొండ అద్దంలోవలె దర్శింపచేసారు రచయిత – సంకలనకర్త శ్రీమండపాక ఆంజనేయమూర్తిగారు.

ఈ చిరుపొత్తం ప్రతియింట తరతరాల తరగని విత్తం కావాలని, ఈ కరదీపం ప్రతివ్యక్తి జీవితంలో సుఖశాంతులు ప్రకాశింపచేసే మణిదీపం కావాలని మంగళాశాసనం చేస్తూ – 'గోవిందప్రియులైన' శ్రీ ఆంజనేయమూర్తి గారికి అభినందనలు సమర్పిస్తున్నాను.

ఇతిశమ్.....

విద్వద్విధేయుడు

భీమవరం
10-12-2015

శ్రీమత్తిరుమల వేంకట రాజగోపాలాచార్యులు
విశ్రాంత కులపతి, సెల్: 9704822274

# కృతజ్ఞతా సమర్పణ

**శ్రీ ఆంజనేయ స్వామి** వారనిన నాకు పంచ ప్రాణములు. తల్లి, తండ్రి, గురువు, దైవము, సమస్తమూ మత్ హృదయమందిర స్థిరనివాసుడగు ఆంజనేయుడే!

బాల్యము నుండి వారే నాతోడు నీడ అని గుర్తెరుగుటకు, వారితో ఇంతగా నేను మమేకమగుటకు

(1) మూల కారణం మా మాతృమూర్తి **శ్రీమతి మండపాక బుచ్చిరామలక్ష్మి (బుచ్చితల్లి) గారు**

(2) మా పితృదేవులు **శ్రీ మండపాక వీర్రాజుగారు** వారిని చూసి నేర్చుకున్న క్రియాభాగం.

(3) నాకు భక్తిని, జ్ఞానాన్ని, పారలౌకికాన్ని అనుగ్రహిస్తూన్న మాతృ, గురు స్వరూపి **మాండలీక లక్ష్మి (మేడమ్ లక్ష్మి)గారు**

(4) గాయత్రిమంత్రోపదేశం ఇచ్చిన సోదరులు **శ్రీ మండపాక అప్పలనరసింహం గారు**

(5) క్రియాయోగ దీక్షా గురువులు

**యోగాచార్య ఆదిరాజు భవానీ శంకర శర్మగారు**

**బ్రహ్మర్షి రాఘవానందనాయక్ గారు** మరియు

**సమస్త దేవీ దేవతా, గురుపరంపరా స్వరూప శ్రీఆంజనేయస్వామివారికి** నా వినయ పూర్వక, భక్తిపూర్వక సహస్రకోటి ప్రణతులు.

నన్ను సర్వకాల సర్వావస్థలయందు ధర్మబద్ధుడనై జీవించునట్లు ఆశీర్వదింప పూజ్యులైన పెద్దలను సవినయంగా ప్రార్థిస్తున్నాను.

ఈ చిన్ని పొత్తము ముద్రించుటకు అన్ని విధముల అనేకానేక సహాయ సహకారములు అందించిన వారందరికి శ్రీ సీతాసమేత శ్రీరామ పాదసేవా దురంధరులు శ్రీఆంజనేయస్వామి వారు సదా అభయమిచ్చి రక్షించుగాక!

'దీన్ని' 'ఇది' ఉద్ధరించుకోవటమే లక్ష్యం.

భవదీయుడు

**మండపాక ఆంజనేయమూర్తి**

ఆర్. అగ్రహారం, గుంటూరు-3

**హనుమద్ వ్రతం**

**23-12-2015**

## విషయానుక్రమణిక

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

# శ్రీ ఆంజనేయా! అభయప్రదాతా

## తులసీదాసకృత శ్రీగణేశస్తుతి

గాయతే గణపతి జగబందన శంకర-సువన భవానీ నందన।

సిద్ధి సదన గజవదన వినాయక కృపాసింధు సుందర సబ్‌లాయక।

మోదకప్రియ ముద మంగళ దాతా విద్యా వారిధి బుద్ధి విధాతా।

మాంగత తులసిదాస కర జోరే బసహి రామ సి మానస-మోరే॥

## ఆంజనేయుని నివాస స్థానములు

కుండినం నామ నగరం శ్రీభద్రం కుశతర్పణమ్।

పంపాతీరం చంద్రకోణం కాంభోజం గంధమాదనమ్॥

బ్రహ్మావర్తపురం చైవ బార్హస్పత్యపురం తథా।

మహిష్మతీపురం చైవ నైమిశారణ్య మేవ చ॥

సుందరీ నగరం చైవ రమ్యం శ్రీమనుమత్పురమ్

ఏతాని హనుమద్భక్త పుణ్యస్థానాని నిత్యశః

య స్స్మరే త్ప్రాత రుత్థాయ భుక్తిం ముక్తిం చ విందతి॥

ప్రతివారు ప్రతిదినం నిదుర లేచిన వెంటనే పై శ్లోకాలను భక్తితో స్మరించిన సకల పాపములనుండి విముక్తులగుటయే గాక, సర్వశుభములను పొందగలరు.

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

## ప్రణవస్వరూపుడు

ఓంకారోపాసనే ప్రణవోపాసన. ప్రణవోపాసనే ప్రాణోపాసన. ప్రాణమంటే వాయువే. 'ఆత్మా వై పుత్ర నామాసి' అన్నట్లు వాయురూపుడే అయిన ఆ హనుమంతుడే ప్రణవమునకు అర్థమౌతాడు. ఆంజనేయుని ప్రధాన నామమైన 'హనుమ' అను శబ్ద మందలి ప్రాణసంయోగమే అ ఉ మ కారములే ఓంకార మగునని హనుమంతుని ప్రణవస్వరూపునిగా పెద్దలు నిరూపించారు.

అసలు ఋగ్వేదంలో ప్రథమ మంత్రమే హనుమత్ప్రతిపాదకంగా గ్రహించదగినది. ఆ మంత్రం

**"అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం**
**హోతారం రత్న ధాతమమ్"** **(ఋ 1-1-1)**

యజ్ఞస్య=రామసుగ్రీవుల స్నేహయజ్ఞానికి; దేవమ్=కారకుడైనవానిని; ఋత్విజమ్(ఋత్వా ఏజమ్)= సముద్రం లంఘించి రాక్షసులను కంపింప జేసిన వానిని; రత్నధాతమమ్=రామ అంగుళీయకమును, సీతా శిరోరత్నమును ధరించిన, పురోహితమ్=సీతాన్వేషణాది కార్యముల ముందు నడచిన దూతయగు; అగ్ని= వాయుసుతుని హనుమంతుని; ఈళే=నమస్కరించు చున్నాను. అని ప్రథమ మంత్రమే హనుమత్పరంగా అన్వయించునట్టిది.

**"అగ్నిం దూతం వృణీమహే హోతారం**
**విశ్వవేదసమ్ అస్య యజ్ఞస్య సుక్రతుమ్ (ఋ 1-12-1)**

అగ్నిం= అగ్రణి= వానరాగ్రణిని (దైత్యవన దాహకాగ్నిని), యజ్ఞస్యదూతమ్=శ్రీరామచంద్రుని దూతను - యజ్ఞోవైవిష్ణుః (శతపథ బ్రాహ్మణం 1-1-2) విష్ణురూపుడే

శ్రీరాముడు సుక్రతుమ్=శోభన కర్మశీలిని- సముద్రోల్లంఘన సీతాన్వేషణ సంజీవ నగాహరణాది లోకోత్తర కృత్యములు కలవానిని; వృణీమహే = ఉపాసించు చున్నాము-ప్రార్థించుచున్నాము.

ఈ మంత్రార్థమే :

**శ్లో॥ మనోజవం మారుత తుల్యవేగం**
**జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం**
**వాతాత్మజం వానరయూథ ముఖ్యం**
**శ్రీరామదూతం శిరసా నమామి ॥**

అను శ్లోకంలో చెప్పబడింది. అగ్ని=అగ్రణి అనే వానరాగ్రణియే, వానరయూథ ముఖ్యం అనే శబ్దంచే చెప్పబడింది. అసలు అగ్ని అంటే వాయుపుత్రుడే. అంటే అది హనుమత్పరమైన శబ్దమే. వాయో రగ్నిః (తై.ఉ. 2-1) అనే శ్రుతి ప్రమాణంతో ఆలోచిస్తే వాయువు నుండి అగ్ని పుట్టాడు. కాబట్టి అగ్ని అంటే వాయు సుతుడన్నమాట. వాయుపుత్రుడు హనుమంతుడనటానికి ప్రమాణాలవసరం లేదు. ఇక 'అస్య యజ్ఞస్య దూతం' అనేదే 'శ్రీరామదూతం'గా కన్పడింది. 'విశ్వవేదవ్‌' అనేదానికి సర్వజ్ఞుడు, విద్వాంసులలో అగ్రగణ్యుడని అర్థం. అదే 'బుద్ధిమతాం వరిష్ఠం' శబ్దంద్వారా తెలియ జేయబడింది.

వేదము యొక్క 1.సంహిత, 2.బ్రాహ్మణ, 3.ఆరణ్యక, 4. ఉపనిషత్ నాల్గు విభాలలో చివరి విభాగమైన వేదాంతమని చెప్పబడే ఉపనిషత్తులలో హనుమంతుడు విశేషంగా తెలియజేయబడినాడు. రామ రహస్యోపనిషత్తు, రామపూర్వోత్తర తాపిన్యుపనిషత్తు, ముక్తికోపనిషత్తు, లాంగూలోపనిషత్తు ఇత్యాదులయందు హనుమద్విషయం కానవస్తుంది.

**శ్రీఆంజనేయుని అవతారములు**

శ్రీఆంజనేయస్వామి ఎన్నో అవతారము లెత్తినట్లు శాస్త్రములు చెప్పుచున్నవి. వానిలో తొమ్మిది అవతారములు సుప్రసిద్ధములు.

**శ్లో॥ ఆద్యః ప్రసన్న హనుమాన్ ద్వితీయో వీరమారుతిః**
**తృతీయో వింశతి భుజః చతుర్థ పంచవక్త్రకః॥**
**శ్లో॥ పంచమోఽ ష్టాదశభుజః శరణ్య స్సర్వ దేహినామ్।**
**సువర్చలాపతి ష్షష్టః సప్తమ స్తు చతుర్భుజః ॥**
**శ్లో॥ అష్టమః కథితః శ్రీమాన్ ద్వాత్రింశద్భుజ మండలః ।**
**నవమో వానరాకార ఇత్యేవ నవ రూపధృత్॥**

**ప్రసన్న హనుమదవతారము:**

విజయుడను ప్రసన్న హనుమ దుపాసనచేసి సంసార సాగరమును తరించెను.

**వీరాంజనేయావతారము:**

మైందుడను మహానుభావుడు వీరాంజనేయ ఉపాసనచేసి ముల్లోకములను సాగరమధ్యమున తేల్చెను.

**వింశతిభుజాంజనేయావతారము:**

బ్రహ్మ ఈ విశంతి భుజాంజనేయ స్వామివారి స్వరూపమును ఉపాసనచేసి ప్రజాపతి యయ్యెను.

**పంచముఖాంజనేయావతారము :**

విభీషణ పుత్రుండగు నీలుండు పంచముఖాంజనేయ స్వామివారి స్వరూపమును ఉపాసన చేసి ఇష్టకామ్యార్థ సిద్ధులను పొందెను.

**అష్టాదశ భుజాంజనేయావతారము :**

దుర్వాసమహర్షి ఈ అష్టాదశ భుజాంజనేయ స్వామివారిని భక్తితో ఉపాసించి పరమయోగి యయ్యెను.

**సువర్చలాహనుమదావతారము :**

ధ్వజదత్తుడను దరిద్ర బ్రాహ్మణుడు ఈ సువర్చలా హనుమదవతారమును శ్రద్ధాసక్తులతో ఉపాసన చేసి ధనవంతుడాయెను.

**చతుర్భుజాంజనేయావతారము :**

కపిలుడను బ్రాహ్మణుడు చతుర్భుజాంజనేయావతారమును ఉపాసన చేసి మోక్షసామ్రాజ్యమును పొందెను.

**ద్వాత్రింశద్భుజాంజనేయావతారము :**

సోమదత్తుడను మహారాజు ఈ ద్వాత్రింశద్భుజాంజనేయ స్వరూపమును నిష్ఠాగరిష్ఠుడై ఉపాసించి మున్ను పోయిన రాజ్యమును మరల పొందెను.

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

## వానరాకారాంజనేయావతారము :

గాలుడను కిరాతకుడు వానరాకార ఆంజనేయావతారమును ఉపాసించి తన కష్టములను పోగొట్టుకొని ధనవంతుడాయెను.

ఈ విధముగా ఎంరెందరో శ్రీహనుమంతుని భక్తి, శ్రద్ధలతో ఉపాసించి తమతమ జన్మలను సార్ధకము చేసికొని కృతార్థులైరి.

ఆపదలు, ఆటంకములు కలిగినప్పుడు వానిని నివారించుటకు శ్రీఆంజనేయుని వీర స్వరూపమును, సుఖములను, లాభమును అపేక్షించువారు శ్రీఆంజనేయుని దాసస్వరూపమును పూజించవలెను.

శ్రీఆంజనేయ స్వామి వారికి నిత్యము శుచియై ప్రదక్షిణములు చేయు వారికి రోగబాధలు తొలగిపోవును. దుష్టగ్రహపీడలు నాశనమగును. సర్వారిష్టములు పటాపంచలగును. సకలాభీష్టములు సిద్ధించును. కలియుగములో అనేక విషమ పరిస్థితులను నివారణకు ఆంజనేయుని సేవించి తరించుట కలికల్మష చిత్తుల కర్తవ్యము.

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

**పరాశర సంహిత:**

శ్రీమన్నారాయణుని కుమారుడు బ్రహ్మ, బ్రహ్మ పుత్రుడు వశిష్ఠుడు. వశిష్ఠుని తనూజుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుడు. ఈ పరాశరుడు పెక్కువేల సంవత్సరములు మహాతపస్సు జేసి అనేక తీర్థయాత్రలు గావించి లోకోపకారార్థమై తన పేర సంహితను అందించెను.

## శ్రీ హనుమద్వ్రత మహిమ

**శ్లో॥ మార్గశీర్షే త్రయోదశ్యాం శుక్లాయాం జనకాత్మజా।**
**దృష్టా దేవీ జగన్మాతా మహావీరేణ ధీమతా॥**

మార్గశీర్ష శుక్ల త్రయోదశి నాడు మహావీరుడును, బుద్ధిమంతులలో వరిష్ఠుడును నగు ఆంజనేయస్వామి జగన్మాతయైన సీతామహాసాధ్విని లంకలో చూచి ఆమెను ఆత్మహత్యనుండి విరమింపజేసి ప్రాణదానము చేసినాడు. అంతియేగాక శ్రీరామచంద్రుని క్షేమవార్తను సీతామహాసాధ్వికి తెల్పి, ఆమెను సంతోషపరచినాడు.

ఆంజనేయస్వామి చేసిన ఉపకారమునకు సీతామహాసాధ్వి "హనుమా! శత్రుపురమున రాక్షస స్త్రీల మధ్యలో కష్టదశయందున్న నాకు ఈనాడు ప్రాణదానము చేసినావు. పైగా నా ప్రాణేశ్వరుని క్షేమవార్తలను వినిపించినావు. కావున ఈ మార్గశీర్ష శుక్ల త్రయోదశి నాడు ఎవరు హనువద్ర్వతమును యథాశక్తిగా సలక్షణముగా చేసికొని కథాశ్రవణము చేసి నీ ప్రసాద స్వీకారము చేయుదురో వారికి అందరకు కష్టములు తొలగిపోయి సుఖములు కలుగును. దిగ్విజయము లభించు"నని ఆశీర్వదించెను.

"మైత్రేయా! శ్రీహనుమంతునికి సాటి రాగల దైవము లేడు. ఆ దేవుని భక్తి శ్రద్ధలతో వ్రతాదులు చేసి తీర్థప్రసాదములు స్వీకరించిన వారు సర్వత్ర విజయమును పొందగలరు"అని పరాశరులవారు మైత్రేయునకు వివరించిరి.

**కదలీవనమధ్యస్థ ఆంజనేయస్వామివారి పూజ:**

'మాసానాం మార్గశీర్షోహం" అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ చెప్పియున్నారు. ఆ గీతాచార్యుని వాక్యమును బట్టి మార్గశీర్షమాసము సాక్షాత్ విష్ణు స్వరూపమని గుర్తించవలెను. ఈ మాసమందే స్వామి శ్రీరామవృత్తాంతమును సీతామాతకు తెలిపి ప్రాణదానము చేసినారు.

మార్గశీర్ష మాసమున అరటితోటలో నున్న హనుమంతుని పూజించి వారికి సకల వాంఛలు తీరును. సముద్రస్నానము వలన సమస్తనదీ స్నానము చేసిన పుణ్యమెట్లు కలగుననో ఒక్క హనుమంతుని ఆరాధించి నందువలన సర్వదేవతారాధన ఫలము కలగును. శౌనకాది మహామునులు వశిష్ఠాది సప్తఋషులును, ధ్రువుడును, మార్గశీర్షమాసమున శనివారమునందు కదలీవనములో నున్న హనుమంతుని పూజించి సఫల మనోరథులైనారు.

## ఆంజనేయస్వామి వారి నామములు :

ఆంజనేయస్వామివారిని వివిధ ప్రాంతములలో భక్తితో పిలుచు నామములు - మన ప్రాంతములో ఆంజనేయస్వామి, మహారాష్ట్రలో మారుతి. కర్ణాటకలో హనుమంతుడు. పంజాబ్, బెంగాల్ ప్రాంతములలో వజ్రింగు (వజ్రసమానదేహు కలవాడు. వజ్రాంగ మహావీర శబ్దము, హనుమంతునకు మాత్రమే కలదు). తిరుపతిలో బేడీఆంజనేయుడు, జాపాలి ఆంజనేయుడు, పూరీజగన్నాథ్‌లలో బేడీహనుమాన్, మహావీర హనుమాన్, కాశీలో సాక్షిహనుమాన్, సంకట మోచన హనుమాన్, అయోధ్యలో చిట్టి హనుమాన్, ఘటికాచల క్షేత్రమున యోగాంజనేయుడు, వినుకొండలో టపా ఆంజనేయుడు, నూజివీడులో అడవి ఆంజనేయుడు అను నామములతోను, ఇంకను అనేక మహాక్షేత్రముల యందు బహువిధములగు నామములతో శ్రీస్వామివారు భక్తరక్షణ చేయుచున్నారు.

వానరగీతలో జాంబవంతుడు చెప్పినది:

ఓ హనుమంతుడా! నీ నామమును స్మరించినంతనే కొండలవంటి మహాపాతక రాశులును అగ్నిచే దూదిపింజలవలె వెంటనే నశించిపోవును. ఏవిధమైన ఆటంకములు ఉండవు. రోగములు దరిచేరవు. లోకమందు ఎవ్వడు భక్తితత్పరుడై మూడు లక్షలు హనుమన్నామము చేయునో వానికి సకల సుఖములు కలుగును.

**శ్లో॥ భుక్తి ముక్తిప్రదం నామ విహాయ హనుమన్ తవ।**
**యస్స్మరంతి జనా మూఢాః కిం విచిత్ర మతః పరమ్ ॥**

ఓ హనుమంతుడా! భుక్తిని ముక్తిని ప్రసాదించునట్టి నీ దివ్యనామమును విడిచి మూఢులైన జనులు మరల మరల జన్మముల నెత్తుచున్నారు. ఇంతకన్న విచిత్రమేమి కలదు? దీనిని బట్టి శ్రీహనుమంతుని స్మరణము మోక్షదాయకమని తెలియుచున్నది. పునర్జన్మ రాహిత్యమునకు హనుమన్నామ స్మరణమే శరణము.

**శ్రీరామలింగేశ్వర లింగ ప్రతిష్ఠ :**

హనుమదీశ్వర మహాలింగమును గూర్చియు, రామేశ్వర మహాలింగమును గూర్చి, స్కాందపురాణాంతర్గత బ్రహ్మఖండమునను, సేతు మాహాత్మ్యమునందును స్పష్టముగా వివరింపబడినది.

శ్రీరాముడు పుష్పక విమానమును ఎక్కి ఆకాశ మార్గమున ప్రయాణించి గంధమాదన పర్వతమున దిగి అచట మునీశ్వరుల దీవనలు పొందెను. అప్పుడు శ్రీరాముడు బ్రహ్మకులజుడైన రావణుని సంహరించుటచే తనకు సంభవించిన పాపమునకు ప్రాయశ్చిత్తమును చెప్పవలసినదిగా అచ్చటి మునీంద్రులను కోరెను. అందులకు ఆ మునీంద్రులు "రామా నీవు నిజముగ పరమాత్మ స్వరూపుడవు. నీకు ఏపాపము అంటదు. అయినను నీవు లోకకళ్యాణార్థము రామేశ్వర క్షేత్రమున నీపేరుతో శివలింగమును ప్రతిష్ఠించుమని చెప్పిరి. శ్రీరామచంద్రుడు శివలింగమును తెచ్చుటకై హనుమను కైలాసమునకు పంపెను. హనుమ రామాజ్ఞతో కైలాసమునకు బోయి శివలింగమును తెచ్చుచుండెన

సూర్యోదయ సమయమే ముహూర్తనిర్ణయమైనందున శివలింగముతో వచ్చుచున్న హనుమ కాంతిని సూర్యకాంతి అని భావించి మహూర్తసమయము మించిపోరాదని అచటి పెద్దలు శ్రీరాముని ఆజ్ఞతో సీతామహాదేవిచే సైకతలింగము ప్రతిష్ఠ చేయించిరి. అంత హనుమ శివలింగమును తెచ్చి శ్రీరామునకు సమర్పించెను. శ్రీరామచంద్రమూర్తి విషయమును గ్రహించి హనుమచే రామలింగేశ్వర లింగమునకు ఉత్తరభాగమున లింగప్రతిష్ఠ చేయించి దానికి "హనుమదీశ్వర మహాలింగ"మని పేరు నిర్ణయించెను.

శ్రీరాముడు హనుమంతునితో "హనుమా! నీచే స్థాపించబడిన లింగమునకు ఇచటికి వచ్చిన భక్తులు అందరూ ముందుగా పూజలు చేయవలెను. ఆవిధముగా ఆరాధించినవారు సంపూర్ణమైన ఫలితమును పొందగలరు"అనిచెప్పిరి. కావున రామేశ్వరమునకు బోయిన వారు ముందుగా హనుమదీశ్వర లింగమును పూజించియే శ్రీరామలింగేశ్వర లింగమును పూజించవలెనని శ్రీరామచంద్రుని శాసనము.

**గంధమాదన పర్వతము :**

ఏబది యోజనముల యెత్తును నూటపది యోజనముల విస్తీర్ణమును కలిగి మేరుపర్వతమునకు నైఋతి దిగ్భాగమున 'గంధమాదనము' అను పర్వతము కలదు. అచట అనేకమునులు తపస్సు చేయుచున్నారు. ఆ పర్వతమునందు మంచి పుష్పవృక్షములు పండ్ల చెట్లును కలవు. అవి అన్ని కాలములయందును ఫల పుష్పములను ఇచ్చుచుండును. సుగంధ ద్రవ్యముల నొసగు చెట్లును ఆ పర్వతముపైన ఉన్నవి.

ఇచట సమస్త జంతువులును జాతివైరము మాని సంచరించుచుండును. సర్వకాలసర్వావస్థలయందును ప్రవహించు నదులతోను చల్లని గాలులతోను గంధర్వ క్రీడా గృహములతోను, నారికేళ, కదలీ, పనస, ఖర్జూరాది వృక్షములతోను శుకపికాది పక్షులతోను ఆ పర్వతము కళకళలాడుచుండును.

ఆ గంధమాదన పర్వతమునందు విశ్వకర్మ

మహేంద్రుని యాజ్ఞతో ఒక సువర్ణమయిన రత్నశాలను నిర్మించెను. దాని వైశాల్యము పది యోజనములు. అందు సువర్ణమయ స్తంభములు కలవు. మఱియు అందు ముత్యములు, ఇంద్రనీలమణులు, పగడములు, పద్మరాగములు వైడూర్యములు మున్నగువానితో చెక్కబడిన రత్నశాలలును విరాజిల్లుచుండును.

అట్టి మహత్తర సౌందర్యనిధానమగు రత్నశాల యందు విహరించుచు హనుమంతుడు నిత్యము చతుర్వేద పారాయణ చేసికొనుచుండును. మరియు తన ఇష్టదైవములైన సపరివార సహిత సీతారామచంద్రులను వేదోక్త విధి విధానములతో పూజించుచుండును. అచ్చటికి వచ్చుచున్న ఋషిగణములకు, వానరులకు, గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుషులకును, దేవతలకు, అప్సరసలకును, అనేకానేక దివ్య సమూహములకును హనుమంతుడు శ్రీసీతా రాముల చరిత్రను వినిపించుచు ఆనందించు చుండును.

**ఇంద్రాది లోకపాలకులచే**

**ఎనిమిది దిక్కులలో ఆంజనేయస్వామి వారి ప్రతిష్ఠ**

మహానుభావుడు వాయుపుత్రుడు అగు ఆంజనేయుడు రాముడను పేరుగల పరమపురుషుని అర్చించుటయందే ఎల్లప్పుడు నిమగ్నుడై యుండును. నాల్గుచేతులు కల్గినవాడై రత్నమయమగు సింహాసనమున కూర్చుండి భక్తజనులచే తారకమంత్రమును చెప్పించుచు బ్రహ్మదేవుని వలె ప్రకాశించుచుండెను.

శ్రీఆంజనేయస్వామి వారి అద్భుతశక్తిని చూసి ఇంద్రుడు మొదలగు లోకపాలకులు మిక్కిలి విస్మయమందినవారై హనుమద్విగ్రహములను భక్తితో ఎనిమిది దిక్కులలో ప్రతిష్ఠించి హనుమంతుని పార్షదులకు సమర్పించిరి.

గంధమాదన పర్వతమున గుహకు **తూర్పు దిక్కున** దూరముగా సరస్సుయొక్క ఒడ్డున హనుమంతుని ప్రతిష్ఠించి **దేవేంద్రుడు జాంబవంతునకు** ఇచ్చెను. **ఆగ్నేయదిక్కున అగ్నిదేవుడు** ఆంజనేయుని శుభప్రదమగు

ప్రతిష్ఠను యథావిధి భక్తితో నొనర్చి **వినతునకు** సమర్పించెను.

**దక్షిణదిక్కు**నందు భక్తిమంతుడగు **యమధర్మరాజు** శుభ ప్రదమగు హనుమత్ప్రతిమను **నీలునకు** సమర్పించెను.

**నైరుతిదిక్కున నిర్బతి పనసు**నకు ప్రీతితో హనుమన్మూర్తిని స్ప్రృశించుచు నిచ్చెను.

**పశ్చిమదిగ్భాగమున వరుణుడు** హనుమద్రూపమును ఆవాహన మొనర్చి **గంధమాదను** దర్పించుటకై పూజ నొనర్చి సమర్పించెను.

**వాయువ్య దిగ్భాగమున** శుభప్రదమగు హనమన్మూర్తిని ఆంజనేయుని తృప్తిపరుచుటకై **సుషేణు**నకు **వాయుదేవుడు** సమర్పించెను.

**ఉత్తర దిక్కున** యక్షగంధర్వ నాయకుడగు **కుబేరుడు** స్వామిని ప్రతిష్ఠించి హనుమంతునిప్రీతికై దానిని **మైందున** కర్పించెను.

**ఈశాన్యదిక్కు**న పార్వతీపతియు లోకములకు శుభ మొనర్చునట్టియు **శంకరుడు** హనుమంతుని ప్రతిమను **ద్వివిదు**నకు సమర్పించెను.

# ఆంజనేయుని వివిధ సమయాలలో సేవించి తరించిన భక్తులు

1. మైందుడను బ్రాహ్మణ శ్రేష్ఠుడు - చైత్రమాసములో, పుష్యమీ నక్షత్రాన స్వామిని పూజించి పూర్ణ మనోరథుడయ్యెను.

2. ధ్వజదత్తుడనే బ్రాహ్మణోత్తముడు - వైశాఖ మాసములో, ఆశ్లేషా నక్షత్రమున స్వామిని పూజించి, మహదైశ్వర్యములనందెను.

3. యవానాశ్వుడను భూసురుడు-వైశాఖ బహుళ దశమినాడు పూజించి అపస్మార వ్యాధి నుండి విముక్తుడయ్యెను.

4. కపిలుడు వైశాఖ మాసమున వచ్చు అమావాస్యనాడు స్వామివారిని అర్చించి ముక్తినొందెను.

5. గాలుడను కిరాతుడు జ్యేష్ఠ శుద్ధ విదియనాడు 'హనుమ'ను ఆరాధించి, కుష్ఠ వ్యాధి నుండి విముక్తుడైనాడు.

6. ఇంద్రుడు ఆషాడ మాసాన రోహిణి నక్షత్రంలో 'హనుమత్పూజ'గావించి వృత్రుని సంహరించెను.

7. ద్రౌపది - ఆశ్వయుజ మాస మృగశిరా నక్షత్రంలో మారుతాత్మజుని పూజించి పరమ భక్తురాలను పేరును పొందెను.

8. అగస్త్యుడు - కార్తీక శుద్ధ ద్వాదశినాడు 'పవమాన సుతుని' పూజించి, సముద్రమును జయించెను.

9. సోమదత్తుడు - మార్గశిర శుద్ధ త్రయోదశిలో - 'కేసరీనందను'ని పూజించి పోయిన రాజ్యమును మరల పొందెను.

10. సుషేణుడను గంధర్వుడు - పుష్యమాసములో, ఉత్తరా నక్షత్రాన 'ఆంజనేయు'నర్చించి గానవిద్యలో జగజ్జేగీయమానడయ్యెను.

11. విభీషణుని కుమారుడు నలుడనువాడు - మాఘ మాసమున వచ్చు ఆర్ద్రానక్షత్రంలో 'కపీశ్వరు'ని సేవించి, సర్వాభీష్ట సిద్ధుడయ్యెను.

12. అంగదుడు - ఫాల్గుణ పునర్వసు నక్షత్రమున 'హరిసత్తము'ని భజించి యువరాజయ్యెను.

13. అర్జునుడు - హస్తా నక్షత్రంతో కూడిన ఆదివారాన 'హనుమంతు'ని పూజించి; అఖిలాండ కోటి బ్రహ్మాండమునకే సర్వ నిర్వాహకుడైన స్వామి శ్రీకృష్ణ పరంధాముని 'సారథి'గా పొంది, తద్వారా - కాలుడైనా జయించలేని - భీష్మ, ద్రోణాది మహావీరులను దునుమాడి జయకేతనమును ఎగురవేసెను.

14. భీముడు - మృగశిరా నక్షత్రయుక్త భాను (ఆది) వారాన 'కపిసత్తము'ని పూజించి, శత్రుంజయు డయ్యెను.

15. భరతుడు ప్రతి శనివారం 'హనుమత్పూజ నొనరించి, మహా బలసంపన్నుడయ్యెను.

16. దుర్వాసుడు-ప్రతి వైధృతి యోగాన 'వాయుపుత్రు'ని పూజించి తపస్సిద్ధి నందెనని పెద్దలు వక్కాణిస్తుంటారు.

ఈ విధంగా - ఆంజనేయుని కథలే గాక, ఆంజనేయుని సేవించి తరించిన వారి కథలనెన్నిటినో పరాశరులవారు మైత్రేయునకు చెప్పారు. హనుమత్పూజ అంటే 'సమస్త దేవతా'పూజే. ప్రతి మంగళ, శని వారాలలో స్వామివారికి ప్రదక్షిణలు, కవచ ధారణాదుల వల్ల సమస్త దుఃఖముల నుండి విముక్తులగుట ముమ్మాటికి నిజం.

సర్వకాల, సర్వావస్థలలో స్మరణీయుడు - సర్వ మాయా విభంజనుడు రుద్రాంశ సంభూతుడు, శ్రీరామచంద్ర పాదాబ్జ సేవానిరతుడైన ఆంజనేయుడే! ఇట్టి పరమ పావనమైన 'స్వామి'వారి భక్తుల కథలు విన్నా, చదివినా కూడా సమస్త దోషములు తొలగిపోవును.

## ప్రదక్షిణ విధానము :

శ్రీ ఆంజనేయస్వామి వారికి ప్రదక్షిణములు చేయువారికి భక్తి, చిత్తశుద్ధి, కష్టసహిష్ణుత, పట్టుదల, అభిమాన రాహిత్యము, ఓర్పు, నియమపాలనము, మితభాషణము, శాంతము, నిరాడంబరత్వము మున్నగు సద్గుణములు అవసరములు. ప్రదక్షిణములను లెక్కించుటకు తెల్లని లేదా పచ్చని పూవులు గాని పసుపుకొమ్ములను గాని వాడుట శ్రేష్ఠము. అగస్త్యమహర్షి ప్రదక్షిణ ఫలితమును గూర్చి మునులతో నిట్లనెను.

**శ్లో॥ 'ప్ర' ఛినత్తి భయం సర్వం 'ద'కారో మోక్ష సిద్ధిదః।**
**'క్షి' కారాత్ క్షీయతే రోగో 'ణ'కార శ్రీ ప్రదాయకః ॥**

'ప్ర' అనెడు అక్షరము సర్వభయములను పోగొట్టును. 'ద' కారము మోక్షమునిచ్చును. 'క్షి'కారము సకల రోగములను హరించును. 'ణ'కారము సిరిసంపదలను కలుగజేయును.

**శ్లో॥ ప్రదక్షిణ నమస్కారాన్ సాష్టాంగాన్ పంచ సంఖ్యయా।**
**దాస్యామి కపినాథాయ గృహాణాఽభీష్టదాయక ॥**

స్వామివారికి ప్రదక్షిణములు, సాష్టాంగ నమస్కారములు ఐదు సార్లు చేయుటయు సంప్రదాయము.

## మార్కండేయ ప్రార్థనా శ్లోకం

మార్కండేయ మహాభాగ సప్తకల్పాంత జీవన।
ఆయురారోగ్యమైశ్వర్యం దేహిమే మునిపుంగవ॥

## సప్తచిరంజీవుల ప్రార్థనా శ్లోకాలు

ద్రోణే మే త్వం మహాభాగ రుద్రతేజః సముద్భవ
ఆయుర్బలం యశోదేహి అశ్వర్థామాన్ నమోఽస్తుతే॥

దైత్యేంద్రకులసంభూత యజ్ఞదానక్రియారత।
బలే త్వాం శరణం యామి దీర్ఘాయుష్యం ప్రయచ్ఛ మే॥

వశిష్ఠకులసంభూత వేదశాస్త్ర విశారద
నారాయణాంస సంభూత వేదవ్యాసం నమోఽస్తుతే॥

అంజనీగర్భ సంభూత కపీంద్ర సచివోత్తమ
రామప్రియ నమస్తుభ్యం హనుమన్ రక్షమాం సదా॥

విభీషణ నమస్తుభ్యం రామపదాబ్జ పూజక
ఆయురారోగ్యమైశ్వర్యం దేహి పౌలస్త్య నందన॥

ద్విజేంద్ర భరతాచార్య సర్వ విద్యా విశారద
శరణంత్వాం ప్రపన్నోస్మి కృప మాం రక్ష సర్వదా॥

రేణుకేయ మహాభాగ కార్తవీర్య కృతాంతక
ఆయుః ప్రయచ్ఛమే రామ జామదగ్న్య నమోఽస్తుతే॥

## పంచముఖ ఆంజనేయస్వామి :

శ్రీరాముని ఆజ్ఞతో శ్రీఆంజనేయస్వామి శతకంఠరావణుని స్వరూపమునకు తగినట్లు తన రూపమును మలచి హుంకరించుచు నిలచిన ఆంజనేయుని ఆ రూపం అతి భయంకరం! అత్యాశ్చర్యమయం!! అద్భుతావహం!!

ఆ రూపాన ఒకటి **వానర ముఖం,**
రెండు **సింహ ముఖం,**
మూడు **గరుడ ముఖం,**
నాలుగు **వరాహ ముఖం,**
ఐదు **అశ్వముఖం.**

ఒక్కొక్క ముఖాన మూడు కన్నులు పది చేతులు ఆ చేతులలో పది ఆయుధాలు (ఇది పంచముఖ ఆంజనేయస్వామివారి ఉగ్రరూపం).

ఆంజనేయుడు పంచాముఖాకృతిని ధరించిన మరుక్షణం ఇదంతా పరికించి చూస్తూన్న 'సీతామాత' కాళీరూపమును ధరించి తన నాలుకను అనేక

యోజనాలకి పెంచి శతాననుని మేని నెత్తురు బొట్లు నేలపై బడకుండా పీల్చింది. ఎపుడైతే నెత్తురు బొట్టులు నేలపై పడుట ఆగిపోయిందో పుట్టే రాక్షస పీడ లేకుండా పోయింది. రానురాను రక్కసులు తరిగిపోయారు. శ్రీఆంజనేయులవారు తన వజ్రసదృశ నఖాలతో, దంష్ట్రలతో రక్కసి మూకను చీల్చి చెండాడారు. మాయావియైన శతకంఠుడు – మహామాయలు తెలిసిన మారుతాత్మజుని ముందు వెలవెల పోయాడు. వివిధాయుధ పాణియై శతాసుని యమపురికి పంపారు శ్రీపంచముఖాంజనేయ స్వామివారు.

లోకాలన్నీ 'జయ జయ' నినాదాలతో పంచముఖ వీరాంజనేయుని, కాళీరూప సీతామహాసాధ్విని స్తోత్రాలతో వేనోళ్ళ కొనియాడారు.

శతకంఠుని మరణంతో తమతమ విశిష్ట రూపాలను ఉపసంహరించుకున్నారు సీతాంజనేయులు. నాటినుండి ఆంజనేయస్వామి **'పంచముఖ ఆంజనేయు'**నిగ ప్రఖ్యాతిని పొందారు.

## పంచముఖి ఆంజనేయస్వామి ప్రార్థన

శ్లో॥వందే వానర నారసింహ ఖగరాట్క్రోడాశ్వ వక్త్రాం చితం,
నానా లంకరణం త్రిపంచ నయనం దేదీప్యమానం రుచా॥
హస్తా బ్జైరసిఖేట పుస్తక సుధా కుంభాం కుశాద్రీన్ గదాం,
ఖట్వాంగం ఫణి భూరుహౌ దశభుజం సర్వారి గర్వాపహమ్॥
అథ ధ్యానం ప్రవక్ష్యామి శ్రుణు పార్వతి యత్నతః,
మద్రత్వం దేవ దేవస్య ధ్యానం హనుమతః పరమ్॥
పంచ వక్త్రం మహాభీమం త్రిపంచ నయనైర్యుతం,
దశ బిర్భాహుభిర్యుక్తం సర్వ కామ్యార్థ సిద్ధిదమ్॥
పూర్వేతు వానరం వక్త్రం హృదయం సూర్య సన్నిభం,
దంష్ట్రా కరాళ వదనం భ్రుకుటీ కుటిలోద్భవమ్॥
అస్యైకం దక్షిణం వక్త్రం నారసింహం మహాద్భుతమ్,
అత్యుగ్రతేజో జ్వ లితం భీషణం భయనాశనమ్॥
పశ్చిమే గారుడం వక్త్రం వజ్రదంష్ట్రం మహా బలం
సర్వ రోగ ప్రశమనం విషరోగ నివారణమ్॥
ఉత్తరే సూకరం వక్త్రం కృష్ణ దీప్తనభోజ్జ్వలం,
పాతాళే సిద్ధిదం నృణాం జ్వర రోగాది నాశనమ్॥

ఊర్ధ్వం హయాననం ఘోరం దానవాంతకరం పరం ।
యేన వక్త్రేణ విప్రేంద్ర సర్వ విద్యా వినిర్యయుః ॥
యేతత్పంచ ముఖం తస్య ధ్యాయతా మభయంకరం ।
ఖడ్గం త్రిశూలం ఖట్వాంగం పాశ మంకుశ పర్వతౌ ॥
ద్వౌముష్టి సంగతౌ మూర్ధ్ని సాయుద్దైర్దశభిర్భుజైః ।
ఏతాన్యాయుధ జాలాని ధారయంతం యజామహే ॥
ప్రేతాసనో పవిష్ఠంతు సర్వాభరణ భూషితం ।
సర్వాశ్చర్య మయం దేవ మనంతం విశ్వతోముఖమ్ ॥
పంచాస్య మచ్యుత మనేక విచిత్ర వీర్యం
శ్రీ శంఖ చక్ర మణి సర్వ భుజాగ్ర దేశం
పీతాంబరం మకర కుండల నూపురాంగం
ప్రద్యోతితం కపివరం హృది భావయామి ॥
మాం పశ్య పశ్య హనుమ న్నిజ దృష్టిపాతైః
మాం రక్ష రక్ష పరితోరిపు దుఃఖ పుంజాత్
వశ్యాం కురు త్రిజగతీ వసుధాధి పానాం
మే దేహి దేహి మహతీం వసుధాం శ్రియంచ ॥

లోకాస్తమస్తాః సుఖినో భవన్తు

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

# శ్రీ శంకరాచార్య కృత పంచరత్నములు

'మండన మిశ్రుడు' సకల వేదపారంగతుడు. సమస్త శాస్త్రములలో ఆరితేరిన దిట్ట. మీమాంసా శాస్త్ర సంజ్ఞాని. యీ మండన మిశ్రునితో వాదించుటకు వెడలు సమయాన 'ఆది శంకరాచార్యు'ల వారు సర్వవిద్యా సంప్రదాయకుడు 'నవవ్యాకరణ పండితు'డైన ఆంజనేయ స్వామిని ప్రార్థించి వాగ్వివాదమునకు వెడలినట్లు పెద్దలు చెప్పుదురు.

**శ్లో॥ తీర్త్వాక్షార పయోనిధిం క్షణ మధోగత్వా శ్రియస్సన్నిధిం**
**దత్వా రాఘవ ముద్రికా ముపశుచం కృత్వా ప్రవిశ్యాటవీం**
**భంక్త్వాశేష తరూన్నిహ త్య బహుశో రక్షో గణా స్తత్పురీం**
**దగ్ధ్వాయ మణిం రఘూత్తమ మగాద్వీరో హనూమాన్కపిః ॥**

**2. తరుణారుణ ముఖ కమలం కరుణారసపూర పూరితాపాంగం।**
**సంజీవన మాశాసే మంజుల మహిమాన మంజులాభాగ్యం ॥**

**3. శంబర వైరి శరాతిగ మంబుజదళ విపుల లోచనాదారం।**
**కంబుగళ మనిలదిష్టం బింబ జ్వలితోష్ఠ మేక మవలంబే॥**

**4. దూరీకృత సీతార్తిః ప్రకటీకృత రామ వైభవ స్ఫూర్తిః**
**దారిత దశముఖ కీర్తిః పురతో మను భాతు హనుమతో మూర్తిః ॥**

**5. వానర నికరాధ్యక్షం దానవకుల కుముద రవికర సదృక్షం।**
**దీన జనావన దీక్షం పవనసుతః పాతు పుంజ మద్రాక్షం।**

**6. ఏతత్పవన సుతస్య స్తోత్రం యః పఠతి పంచ రత్నాఖ్యం।**
**చిరమిహ నిఖిలాన్ భోగాన్ భుక్త్వా శ్రీరామభక్తి భాగ్భవతి ॥**

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

## శ్రీ హనుమత్సూక్తము

శ్రీమాన్! సర్వలక్షణ సంపన్నో, జయప్రదః సర్వాభరణ భూషిత, ఉదారో మహోన్నత ఉష్ట్రారూఢః కేసరిప్రియ నందనో! వాయుతనూజో! యథేచ్ఛం పంపాతీర విహారీ! గంధమాధన సంచారీ! హేమప్రాకారాంచిత, కనక కదలీవనాంతరనివాసీ! పరమాత్మా! మకరీశాపవిమోచనో! హేమవర్ణో! నానారత్న, ఖచిత, మాలా! మాఖలాంక, స్వర్ణోపవీతం కౌశేయవస్త్రం చ బిభ్రాణః సనాతనో మహాబలాప్రమేయప్రతాప శాలీ రజితవర్ణః శుద్ధస్పటిక సంకాశః పంచవదనః పంచదశనేత్ర, స్సకలదివ్యాస్త్రధారీ! శ్రీసువర్చలారమణీ! మహేంద్రాద్యష్టదిక్పాలక త్రయస్త్రింశద్గీర్వాణ, మునిగణగంధర్వ, యక్షకిన్నర, పన్నగాసురపూజిత పాదపద్మయుగళః నానావర్ణః కామరూపః కామచారీ యోగిధ్యేయః శ్రీహనుమాన్ ఆంజనేయః విరాడ్రూపః విశ్వాత్మాపావకనందనః పార్వతీపుత్రః ఈశ్వరతనూజః సకల మనోరథాన్నో దదాతు!

ఇదంచ హనుమత్సూక్తం యోధీమాన్ భక్తిసంయుతః
పఠత్యనుదినం నిత్యం ముక్తోభవతిపాపేభ్యః.

ఈసూక్తమును మూడుమారులు పఠించిన హనుమత్సాయుజ్యము ప్రాప్తించి, సమస్త పాపములు నశించును, సర్వకామ్యార్థములు సిద్ధించును.

## కార్యసాధక స్తోత్రం

జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ॥

దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లి ష్టకర్మణః
హనుమాన్ శత్రు సైన్యానాం నిహంతా మారుతాత్మజః ॥

న రావణ సహస్రం మే యుద్ధా ప్రతిబలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః ॥

అర్థయిత్వా పురీం లంకాం అభివాద్య చ మైథిలీం
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసాం ॥

అస్త్ర విజ్జయతాం రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజాజయతి సుగ్రీవో రాఘవేణాభి పాలితః ॥

అహం కోసల రాజస్య దాసః పవన సంభవః
హనుమానితి సర్వత్ర నామ విశ్రావితం మయా ॥

కార్యసాధకుడు కావాలంటే సుందరకాండలో స్వయంగా స్వామివారే స్తుతించిన యీ స్తోత్రం తప్పక విధిగా పారాయణ చేయాలి. అలాచేసి అనుభవంలో అద్భుత ఫలితాలను పొందండి.

# వానరగీత

## (హనుమశ్శక్తి వర్ణన)

ముప్పది ముగ్గురు వానర ముఖ్యులు శ్రీ ఆంజనేయ స్వామిని స్తుతించగా దానిని అగస్త్యమహర్షి "వానరగీత"గా గ్రహించి తరువాత కొంతకాలము నందొక్కనాడు ఇంద్రునికి దీనిని ఋషి ఛందస్సులతో ఉపదేశించినారు.

"అస్య శ్రీ వానరగీతా స్తోత్రమంత్రస్య, అగస్త్య భగవాన్ ఋషిః, జగతీచ్ఛందః, శ్రీహనుమాన్ దేవతా। మారుతాత్మజ ఇతి బీజం। అంజనాసూనురితి శక్తిః వాయుపుత్ర ఇతి కీలకం। హనుమత్ప్రసాద సిధ్యర్థే వానరగీతా పఠన పారాయణే వినియోగః

॥ ధ్యానమ్ ॥

వామే జానుని వామజాను మపరం జ్ఞానాఖ్య ముద్రాన్వితం
హృద్దేశే కలయన్నుతో మునిగణై రధ్యాత్మ దక్షేక్షణః।
ఆసీనః కదళీవనే మణిమయే బాలార్క కోటి ప్రభః
ధ్యాయన్ బ్రహ్మపరం కరోతు మనసా శుద్ధిం హనుమాన్మమ॥

సుగ్రీవుడు

సువర్ణ శైలస్య గవాం చ కోటి శతస్య కోటే శ్చ శతస్య యచ్ఛ,
దానస్య నై వ్యాప్తి సహం ఫలం చ ధ్రువం చ తన్మారుతి దర్శనేన

గంధమాధనుడు

హనుమ న్నితి మే స్నానం హనుమ న్నితి మే జపః
హనుమ న్నితి మే ధ్యానం హనుమ త్కీర్తనం సదా

సుషేణుడు

రామభక్త చరితా కథామృతం, వాయుతనయ గుణాను కీర్తనమ్
రామదాస! తవ పాదం సేవనం, సంభవన్తు మమ జన్మజన్మని॥

అంగదుడు

మాతా సువర్చలాదేవి పితా మే వాయునందన।
బాంధవా హనుమద్భక్తాః స్వదేశం భువనత్రయమ్॥

నీలుడు

భక్తకల్పతరుం సౌమ్యం లోకోత్తర గుణాకరం
సువర్చలాపతిం వందే మారుతిం వరదం సదా

గవాక్షుడు

వాయుపుత్రేణ మహతా యద్వదుక్తం కరోమి తత్
న జానామి తతో ధర్మమధ్దర్మం రక్ష మాం సదా

మైందుడు

సమీరసూతేః సతతం త్వదాజ్ఞయా త్వదంశకః ప్రేరిత మానసేంద్రియః
కరోమ్యహం యచ్చ శుభాశుభం ప్రభో త్వత్ప్రీతయే మత్కృతమస్తు తత్సదా

ద్వివిదుడు

రామాదీనాం రణే ఖ్యాతిం దాతుం యో రావణాదికాన్
నావధీ త్స్వయ మేవైకస్తం వందే హనుమత్ప్రభుమ్

శరభుడు

భౌమస్య వాసరే పూజా కర్తవ్యా హనుమత్ప్రభోః
భవేత్స శ్శుచి రాయు శ్రీః పుత్ర మిత్ర కళత్రవాన్

గవయుడు

ఆమీషీకృత మార్తాండం గోష్పదీకృత సాగరం
తృణీకృత దశగ్రీవం ఆంజనేయం నమామ్యహమ్

ప్రహస్తుడు

ఉల్లంఘ్య సింధో స్సలిలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః
ఆదాయతే నైవ దదాహలంకాం నమామి తం ప్రాంజలి రామాంజనేయం

నలుడు

నమో మ్యహం వాయుజ పాదపంకజం కరోమి తద్వాయుజ పూజనం సదా,
వదామి వాతాత్మజ నామ మంగళం స్మరామి వాయోర్భవ కీర్తనం శుభమ్

ధర్మకుడు

సప్తషష్టిర్వతాన్ కోటి వానరాణాం తరస్వినాం
య స్సంజీవనయామాస తం వందే మారుతాత్మజమ్

గజుడు

తనౌ వాలపాశః పితా పార్వతీశః స్ఫుర ద్బాహుదండౌ ముఖే వజ్రదంష్ట్రా
సతీ చాంజనా యస్య మాతా తతో న్యం నజానే నజానే నజానే నజానే

ఋక్షరజసుడు

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమ త్స్మరణాద్భవేత్

సంపాతి

సీతాశోకస్య నాశాయ శ్రీరామే శోకనాశనం
సాధకానాం సుఖం ధన్యం మాయుసూనం నమామ్యహమ్

వేగవంతుడు

అంజనావరపుత్రాయ రామేష్టాయ హనూమతే
సర్వలోకైక వీరాయ భవిష్య ద్బహ్మణే నమః

రుంద్రగ్రీవుడు

హనుమ త్సదృశం దైవం నాస్తి నాస్తీతి భూతలే
తం పూజయంతి సతతం బ్రహ్మ గౌరీ మహేశ్వరాః

దధిముఖుడు

ఆలోడ్య వేదశాస్త్రాణి సర్వా ణ్యపి మహర్షిభిః
ఇద మేకం సునిర్ణీతం నదైవం హనుమత్పరమ్

సుదంష్ట్రః

మంగళం హనుమ న్నిత్యం మంగళం కపిపుంగవ
మంగళంచాంజనాసూనో మంగళం రాఘవప్రియ

ఋషభుడు

కరుణారస పూర్ణాయ జగదానంద హేతవే
కుక్షిస్థాఖిలలోకాయ హనూమద్బ్రహ్మణే నమః

పృథువు

దాతా దాపయితా చైవ సంవాహన్ రక్షక స్తథా
ప్రేరక శ్చానుమోదచ కర్తా భోక్తా కపిశ్వరః

జాంబవంతుడు

భుక్తి ముక్తి ప్రదం నామ విహాయ హనుమాన్ తవ
సంస్మరంతి జనామూఢాః కిం విచిత్రమతః పరమ్

జ్యోతిర్ముఖుడు

మంత్ర్యార్థనా ఫల మిదం మమ జన్మన శ్చ
నేచ్ఛామి కించి దపరం హనుమాన్ మహాత్మన్
త్వ ద్దాస దాసజన పాద రజోనికేత
ముస్మద్ధితో భవతు సేవక పారిజాత

సుముఖుడు

రసనే రససారజ్ఞ మధురాస్వాద కాంక్షిణీ
హనుమన్నామపీయూషం సర్వదా రసనే పిబ

గోలాంగూలుడు

కుతో దుర్దినం వాకుతో భౌమవారః కుతో వైధృతి స్తస్య భద్రా కథం వా
కుతా వా వ్యతీపాతదోష క్షుతం వా హనూమత్పద ధ్యానవీతా శుభస్య

కుముదుడు

త్రాతారో భువి పాదాశ్చ మార్గాశ్చ రసనే త్వయా
హనుమ న్నిర్మితా స్సన్తి జనానాం హీనతా కుతః

శతబలి

ధన్యో౽ స్మ్యనుగ్రహాతో౽ స్మి పుణ్యో౽ స్మిమహా౽ తోస్మ్యహం
హనుమాన్ త్వ త్వదాంభోజ సేవావిభవయోగతః

కేసరి

త్వత్తో౽ న్యం శరణం నాస్తి త్వమేవ మమ రక్షకః
అతో మయి కృపాదృష్ట్యా హనుమన్ రక్షమాం సదా

మారీచుడు

సదా పాపౌఘనిష్ఘ్యాతం పాపేషు హృష్టమానసం
పాపాత్మానం మహాపాపం రక్షమాం హనుమత్ప్రభో

తరుణుడు

హనుమదాజ్ఞయా యచ్చ భావి త ద్భవతి ధృవం
య దభావి న త ద్భావి వృథా దేహ పరిశ్రమః

గోముఖుడు

ఆపరాధశతం నిత్యం కుర్వాణం మాం నృశంసకం
క్షమస్య దాసబుద్ధ్యా త్వం హనుమాన్ కరుణానిధే

పనసుడు

హనుమతో న పరం పరమార్థతో
హనుమతో న పరం పరమార్థతః
ఇతి వదామి జానాన్ పరమార్థతో
న హి పరం భవాత త్ర విచక్షణ

వానర యోధాన యోధులచే స్తుతించబడిన వానరగీత సమాప్తం

# త్రికాలహనుమద్ధ్యానమ్

## ప్రాతస్మరణమ్

శ్లో॥ ప్రాతస్స్మరామి హనుమంత మనంత వీర్యం
శ్రీరామచంద్ర చరణాంబుజ చంచరీకం।
లంకాపురీదహనవందిత దేవబృందం
సర్వార్థసిద్ధిసదనం। ప్రధిత ప్రభావమ్॥

## మధ్యందిన స్మరణమ్

శ్లో॥ మాధ్యంనమామివృజినార్ణవతారణైకా
ధారం శరణ్యముదితానుభవప్రభావం
సీతాధిసింధు పరిశోషణకర్మదక్షం
వందారుకల్పతరుమవ్యయమాంజనేయమ్॥

## ప్రదోషకాల స్మరణమ్

శ్లో॥ సాయంభజామి శరణక్షపకృతాఖిలార్తి
పుంజప్రణాశనవిధౌ ప్రధిత ప్రతాపం
అక్షాంతకం సకల రాక్షసవంశధూమ
కేతుం ప్రమోదిత విదేహసుతం దయాలుమ్॥

శ్లో॥ ఋషిర్గురుత్వాచ్ఛిరసి। ధ్యేయత్వాద్దేవతా
హృది। ఛందోక్షరత్వాజ్జిహ్వాయాం। న్యస్తవ్యంమంత్రవిత్తమైః॥

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

## పరాశరకృత హనుమన్నామ స్మరణ మహిమ

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వంచ హనూమత్స్మరణాద్భవేత్ ॥
పవిత్రం హనుమన్నామద్వాదశావృతి మాత్రతః
యే స్మరంతి జనాస్తేషాం కార్యసిద్ధిర్భవే ధ్రువం ॥

బుద్ధి, బలం కీర్తి, ధైర్యం, నిర్భయత్వం, అరోగత జాడ్యములు తొలగుట, వాక్పటుత్వం మొదలైనవన్నీ హనుమన్నామ స్మరణచే చేకూరుతాయి. పవిత్రమైన హనుమన్నామమును భక్తితత్పరులై పన్నెండు మార్లు తలచిన కార్యసిద్ధి అగునని తెలిపిరి.

### శ్రీఆంజనేయస్వామి వారి గాయత్రి

ఆంజనేయాయ విద్మహే మహాబలాయ ధీమహి తన్నో కపిః ప్రచోదయాత్
పవనాత్మజాయ విద్మహే రామభక్తాయ ధీమహి తన్నో కపిః ప్రచోదయాత్

### శ్రీరామ గాయత్రి

దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి తన్నో రామః ప్రచోదయాత్

### సీతా గాయత్రి

మహాదేవ్యైచ విద్మహే రామపత్న్యై చ ధీమహి తన్నో సీతా ప్రచోదయా[illegible]

శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ।

## -: అథ అంగపూజ :-

ఓం మారుతయే నమః। పాదౌ పూజయామి

ఓం సుగ్రీవ సఖాయ నమః। గుల్ఫౌ పూజయామి

ఓం అంగద మిత్రాయ నమః। జంఘౌ పూజయామి

ఓం రామదాసాయనమః। ఊరూ పూజయామి

ఓం అక్షయ్నాయ నమః। కటిం పూజయామి

ఓం లంకా దహనాయ నమః। వాలం పూజయామి

ఓం సంజీవన నగా హర్త్రే నమః। స్తనౌ పూజయామి

ఓం సౌమిత్రి ప్రాణదాయ నమః। వక్షస్థలం పూజయామి

ఓం కుంటిత దశకంఠాయ నమః। కంఠం పూజయామి

ఓం రామాభిషేక కారిణే నమః। హస్తే పూజయామి

ఓం మంత్రరచిత రామాయణాయ నమః। వక్త్రం పూజయామి

ఓం ప్రసన్న వదనాయ నమః। వదనం పూజయామి

ఓం పింగళ నేత్రాయ నమః। నేత్రౌ పూజయామి

ఓం శ్రుతి పారాయణాయ నమః। శ్రోత్రౌ పూజయామి

ఓం ఊర్ధ్వ పుండ్రధారిణే నమః। కపోలం పూజయామి

ఓం మణికంఠ మాలికాయ నమః। శిరః పూజయామి

ఓం సర్వాభీష్ట ప్రదాయ నమః। సర్వాణి అంగాని పూజయామి

శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ।

# అథ సప్తవింశతి నామ పూజ

01. ఓం హనుమతే నమః
02. ఓం అంజనాసూనవే నమః
03. ఓం వాయుపుత్రాయ నమః
04. ఓం మహాబలాయ నమః
05. ఓం కపీంద్రాయ నమః
06. ఓం పింగాక్షాయ నమః
07. ఓం లంకాద్వీప భయంకరాయ నమః
08. ఓం ప్రభంజన సుతాయ నమః
09. ఓం వీరాయ నమః
10. ఓం సీతాశోక వినాశకాయ నమః
11. ఓం అక్షమంత్రే నమః
12. ఓం రామసఖాయ నమః
13. ఓం రామకార్య ధురంధరాయ నమః
14. ఓం మహౌషధీ గరి హారిణే నమః
15. ఓం వానర ప్రాణదాయకాయ నమః
16. ఓం వారీశ తారిణే నమః
17. ఓం మైనాకగిరి పూజితాయ నమః
18. ఓం నీరంజనాయ నమః
19. ఓం జితక్రోధాయ నమః
20. ఓం కదళీవన సంవృతాయ నమః
21. ఓం ఊర్ధ్వ రేతసే నమః
22. ఓం మహాసత్వాయ నమః
23. ఓం సర్వమంత్రే ప్రదాయకాయ నమః
24. ఓం మహాలింగ ప్రతిష్ఠాత్రే నమః
25. ఓం భాష్యకృతే నమః
26. ఓం జపతాం వరదాయ నమః
27. ఓం శివధ్యాన పరాయణాయ నమః

నానావిధ పరిమళ పత్ర పుష్పాక్షతాన్ సమర్పయామి.

# అష్టోత్తర శత నామములు

01. ఓం ఆంజనేయాయ నమః
02. ఓం మహావీరాయ నమః
03. ఓం హనుమతే నమః
04. ఓం మారుతాత్మజాయ నమః
05. ఓం తత్వజ్ఞాన ప్రదాయ నమః
06. ఓం సీతాదేవి ముద్రా ప్రదాయకాయ నమః
07. ఓం అశోకవనికా చ్ఛేత్రే నమః
08. ఓం సర్వమాయా విభంజనాయ నమః
09. ఓం సర్వబంధ విమోక్త్రే నమః
10. ఓం రక్షోవిధ్వంసకారకాయ నమః
11. ఓం పరవిద్యాపరీహారాయ నమః
12. ఓం పరశౌర్య వినాశనాయ నమః
13. ఓం పరమంత్ర నిరాకర్త్రే నమః
14. ఓం పరమంత్ర ప్రబేధకాయ నమః
15. ఓం సర్వగ్రహ వినాశనే నమః
16. ఓం భీమసేన సహాయకృతే నమః
17. ఓం సర్వదుఃఖహరాయ నమః
18. ఓం సర్వలోకచారిణే నమః
19. ఓం మనోజవాయ నమః
20. ఓం పారిజాతధృమాలస్థాయ నమః

21. ఓం సర్వమంత్రస్వరూపాయ నమః
22. ఓం సర్వతంత్ర స్వరూపిణే నమః
23. ఓం సర్వయంత్రాత్మకాయ నమః
24. ఓం కపీశ్వరాయ నమః
25. ఓం మహాకాయాయ నమః
26. ఓం సర్వరోగ హరాయ నమః
27. ఓం ప్రభవే నమః
28. ఓం బలసిద్ధి కరాయ నమః
29. ఓం సర్వవిద్యా సంపత్ప్రదాయకాయ నమః
30. ఓం కపిసేనానాయకాయ నమః
31. ఓం భవిష్యచ్చతురాననాయ నమః
32. ఓం కుమార బ్రహ్మచారిణే నమః
33. ఓం రత్నకుండల దీప్తిమతే నమః
34. ఓం చంచలద్వాల సన్నద్ధలంబమాన శిఖోజ్జ్వలాయ నమః
35. ఓం గంధర్వవిద్యాతత్వజ్ఞాయ నమః
36. ఓం మహాబల పరాక్రమాయ నమః
37. ఓం కారాగృహ విమోక్త్రే నమః
38. ఓం శృంఖలాబంధ మోచకాయ నమః
39. ఓం సాగరోత్తారకాయ నమః
40. ఓం ప్రాజ్ఞాయ నమః
41. ఓం రామదూతాయ నమః
42. ఓం ప్రతాపవతే నమః

43. ఓం వానరాయ నమః
44. ఓం కేసరీపుత్రాయ నమః
45. ఓం సీతాశోక నివారణాయ నమః
46. ఓం అంజనాగర్భ సంభూతాయ నమః
47. ఓం బాలార్క సదృశనాయ నమః
48. ఓం విభీషణ ప్రియకరాయ నమః
49. ఓం దశగ్రీవ కులాంతకాయ నమః
50. ఓం లక్ష్మణప్రాణదాత్రే నమః
51. ఓం వజ్రకాయాయ నమః
52. ఓం మహాద్యుతయే నమః
53. ఓం చిరంజీవినే నమః
54. ఓం రామభక్తాయ నమః
55. ఓం దైత్యకార్య విఘాతకాయ నమః
56. ఓం అక్షహంత్రే నమః
57. ఓం కాంచనాభాయ నమః
58. ఓం పంచవక్త్రాయ నమః
59. ఓం మహాతపసే నమః
60. ఓం లంకిణీ భంజనాయ నమః
61. ఓం శ్రీమతే నమః
62. ఓం సింహికాప్రాణభంజనాయ నమః
63. ఓం గంధమాదన శైలస్థాయినే నమః
64. ఓం లంకాపుర విదాహకాయ నమః

65. ఓం సుగ్రీవ సచివాయ నమః
66. ఓం ధీరాయ నమః
67. ఓం శూరాయ నమః
68. ఓం దైత్యకులాంతకాయ నమః
69. ఓం సురార్చితాయ నమః
70. ఓం మహాతేజసే నమః
71. ఓం రామచూడామణి ప్రదాయ నమః
72. ఓం కామరూపిణే నమః
73. ఓం పింగళాక్షాయ నమః
74. ఓం వార్ధిమైనాక పూజితాయ నమః
75. ఓం కబలీకృతమార్తాండ మండలాయ నమః
76. ఓం విజితేంద్రియ నమః
77. ఓం రామసుగ్రీవ సంధాత్రే నమః
78. ఓం మహారావణ మర్ధనాయ నమః
79. ఓం స్ఫటికాభాయ నమః
80. ఓం వాగధీశాయ నమః
81. ఓం నవవ్యాకృతిపండితాయ నమః
82. ఓం చతుర్భాహవే నమః
83. ఓం దీనబంధవే నమః
84. ఓం మహాత్మనే నమః
85. ఓం భక్తవత్సలాయ నమః
86. ఓం సంజీవననాగాహర్త్రే నమః

087. ఓం శుచయే నమః
088. ఓం వాగ్మినే నమః
089. ఓం ధృఢవ్రతాయ నమః
090. ఓం కాలనేమి ప్రమథనాయ నమః
091. ఓం హరిమర్కట మర్కటాయ నమః
092. ఓం దాంతాయ నమః
093. ఓం శాంతాయ నమః
094. ఓం ప్రసన్నాత్మనే నమః
095. ఓం శతకంఠ మదాపహృతే నమః
096. ఓం యోగినే నమః
097. ఓం రామకథాలోలాయ నమః
098. ఓం సీతాన్వేషణ పండితాయ నమః
099. ఓం వజ్రదంష్ట్రాయ నమః
100. ఓం వజ్రనఖాయ నమః
101. ఓం రుద్రవీర్య సముద్భవాయ నమః
102. ఓం ఇంద్రజిత్ప్రహితామోఘ బ్రహ్మాస్త్రనివారకాయ నమః
103. ఓం పార్థధ్వజాగ్ర సంవాసినే నమః
104. ఓం శరపంజర బేధకాయ నమః
105. ఓం దశబాహవే నమః
106. ఓం లోకపూజ్యాయ నమః
107. ఓం జాంబవత్ప్రీతివర్ధనాయ నమః
108. ఓం శ్రీసీతా సమేతశ్రీరామపాద సేవాదురంధరాయ నమః

**అష్టోత్తరపూజాం సమర్పయామి**

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

## హనుద్విజయ నామ ఘోష

| | | | |
|---|---|---|---|
| ఓంకార రూపా | జైజైహనుమ | సురగణవందిత | జైజైహనుమ |
| ఓంకారేశ్వర | జైజైహనుమ | సువర్చలారమణ | జైజైహనుమ |
| శ్రీరామభక్త | జైజైహనుమ | రామరసామృత | జైజైహనుమ |
| పురాణపురుష | జైజైహనుమ | రామసేవకా | జైజైహనుమ |
| పరమ దయాళో | జైజైహనుమ | ఆనందరూపా | జైజైహనుమ |
| కల్మష భంజన | జైజైహనుమ | ఆద్యంతరహితా | జైజైహనుమ |
| కరుణా సాగర | జైజైహనుమ | పంపావిహారా | జైజైహనుమ |
| భక్తవత్సలా | జైజైహనుమ | పాప వినాశన | జైజైహనుమ |
| భాగవతప్రియ | జైజైహనుమ | ఇహపరదాయక | జైజైహనుమ |
| వజ్రమకుటధర | జైజైహనుమ | ఈశ్వర తేజా | జైజైహనుమ |
| విరోధిమర్ధన | జైజైహనుమ | బ్రహ్మాండరూపా | జైజైహనుమ |
| దుష్టసంహార | జైజైహనుమ | భక్తవత్సలా | జైజైహనుమ |
| దురిత నివారణ | జైజైహనుమ | భవభయ హరణా | జైజైహనుమ |
| శిష్టపాలకా | జైజైహనుమ | భక్తవశంకర | జైజైహనుమ |
| కష్టనివారణ | జైజైహనుమ | జ్ఞాన ప్రదాత | జైజైహనుమ |
| మారుతాత్మజా | జైజైహనుమ | దినకరతేజా | జైజైహనుమ |
| మహాబలేశ్వర | జైజైహనుమ | ధరణీనాయక | జైజైహనుమ |
| ధర్మోద్ధరణా | జైజైహనుమ | ప్రసన్నమూర్తీ | జైజైహనుమ |
| ధర్మరక్షణా | జైజైహనుమ | పాపవిమోచన | జైజైహనుమ |

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ।

త్రిగుణాతీత జైజైహనుమ
త్రిలోకవంద్యా జైజైహనుమ
వానరసేవిత జైజైహనుమ
విభీషణార్చిత జైజైహనుమ
విశ్వపాలకా జైజైహనుమ
విశ్వసేవితా జైజైహనుమ
అభయప్రదాతా జైజైహనుమ
ఆర్తరక్షణా జైజైహనుమ
కాంచనాంబరా జైజైహనుమ
సింధూరతిలకా జైజైహనుమ
సింధూరార్చిత జైజైహనుమ
ఆశ్రితపాలక జైజైహనుమ
ఆపద్బాంధవ జైజైహనుమ
అనాధరక్షక జైజైహనుమ
అభిషేకప్రియ జైజైహనుమ
ఆనందదాయక జైజైహనుమ
గంధర్వసేవిత జైజైహనుమ
గ్రహదోష వినాశా జైజైహనుమ

కల్పాంతవాసా జైజైహనుమ
కర్మఫల దాతా జైజైహనుమ
సింహ పరాక్రమ జైజైహనుమ
సింధూరవదనా జైజైహనుమ
జగద్వందితా జైజైహనుమ
జగదానందకరా జైజైహనుమ
జితేంద్రియా జైజైహనుమ
జగన్నాయకా జైజైహనుమ
శివావతారా జైజైహనుమ
స్వయంప్రకాశా జైజైహనుమ
వాయునందన జైజైహనుమ
అంజన తనయ జైజైహనుమ
భాగ్యప్రదాత జైజైహనుమ
భాగ్యవిధాత జైజైహనుమ
ఆరోగ్యదాత జైజైహనుమ
ఆనందదాయక జైజైహనుమ
ఆపద్బాంధవ జైజైహనుమ
అఖిలాండేశ్వర జైజైహనుమ

శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ।

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

గానవిలోలా జైజైహనుమ
ప్రత్యక్షమూర్తీ జైజైహనుమ
పుండరీకాక్ష జైజైహనుమ
దయాసింధూ జైజైహనుమ
దయా సాగర జైజైహనుమ
దేవాది దేవా జైజైహనుమ
వేదాంత వేద్యా జైజైహనుమ
వేద వేద్యా జైజైహనుమ
బ్రహ్మస్వరూపా జైజైహనుమ
స్వర్ణమకుటధర జైజైహనుమ
సామగానప్రియ జైజైహనుమ
సువర్చలాప్రియ జైజైహనుమ
సురగణసేవిత జైజైహనుమ
పాపవినాశక జైజైహనుమ
జ్ఞానగుణసాగర జైజైహనుమ
సుగుణారాధన జైజైహనుమ
సాత్విక లక్షణ జైజైహనుమ
సాత్విక బోధన జైజైహనుమ

స్వయంప్రకాశక జైజైహనుమ
పరమపావనా జైజైహనుమ
ప్రశాంత వదనా జైజైహనుమ
పాహిప్రభో జైజైహనుమ
మారుతాత్మజా జైజైహనుమ
అంజనినందన జైజైహనుమ
అద్వైతమూర్తి జైజైహనుమ
అవ్యక్తమూర్తీ జైజైహనుమ
అద్భుతమూర్తి జైజైహనుమ
సద్బ్రహ్మచారి జైజైహనుమ
గౌరీనందన జైజైహనుమ
జగత్పరిపాలక జైజైహనుమ
జగన్మంగళా జైజైహనుమ
మారుతిదేవా జైజైహనుమ
దుష్టశిక్షక జైజైహనుమ
భక్తులబ్రోవర జైజైహనుమ

శ్రీరామరామరామేతి రమే రామే మనోరమే
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే।

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

# హరి హర అష్టోత్తర శత నామములు

కాశీపుణ్య క్షేత్రమందు యమధర్మరాజు వారి కింకరులను ఉద్దేశించి ఈ నామములు ఎవ్వరైనను తమ జీవితంలో ఒక పర్యాయం భక్తి శ్రద్ధలతో చదివినను విన్నను వారిని విష్ణుదూతలు లేదా శివదూతలు మాత్రమే తీసుకు వెళ్ళుదురు, మీరు వారిఛాయలకు వెళ్ళరాదని ఆదేశించారు. (ప్రతీ నామమునకు ముందు ఓం చేర్చవలెను, చివర నమః కలిపి చదువుకొనగలరు)

| | | |
|---|---|---|
| గోవింద | వాసుదేవ | హరి |
| భూతేశ | విషమేక్షణ | రజనీశకలావసంత |
| భూప | మురారి | రమేశ్వర |
| గంగాధర | వృషభధ్వజ | పినాకపాణి |
| చాణూరమర్ధన | ఋషీకపతి | శ్రీరామ |
| చండికేశ | భూతపతి | భర్గ |
| కంసప్రణాశన | శౌరి | అనిరుద్ధ |
| కర్పూరగౌర | ఫాలనేత్ర | శూలపాణి |
| గోపీపతి | కృష్ణ | నృసింహ |
| శంకర | హర | త్రిపథగార్ధజటాకలాప |
| పీతవశన | గరుడధ్వజ | మురహర |
| ఈశ | కృత్తివసన | ఈశ |
| గోవర్ధనోద్ధరణ | సర్పధారి | రాఘవ |
| ఫాలమృగాంకవర్ణ | గౌరీపతి | ఉరగాభరణ |
| మాధవ | కమఠ | పద్మనాభ |
| భవ | శూలి | ఉగ్ర |

మధుసూధన
పినాకపతి
అఖ్య
ప్రమదాధినాథ
నారాయణ
మృత్యుంజయ
పురుషోత్తమ
త్రిదశైకనాథ
అచ్యుత
కామశత్రు
అద్యపాణి
దిద్వసన
చక్రపాణి
భూతేశ
బ్రహ్మణ్యదేవ
శర్వ
ముకుంద
విశ్వేశ్వర
సనాతన
త్రినేత్ర

రావణారి
శ్రీకంఠ
ధర్మధురీణ
శంభువ
కమలాధీశ
ఈశాన
యదుపతి
మృడ
ధరణీధర
అంధకహర
సారంగపాణి
మురారి
విష్ణో
నీలకంఠ
వైకుంఠ
దేవదేవ
మధురిపు
త్రిలోచన
కైటభరిపు
చంద్రచూడ

కేశినాశ
ఈశ గిరీశ
లక్ష్మీపతి
త్రిపురారి
వాసుదేవసూనుడ
యక్ష
శ్రీకాంత
శివ
అసురవిమర్దన
మన్మధరిపు
జనార్ధన
ఖండపరసు
శంఖపాణి
శశిశేఖర
దామోదర
రిపుసూధన
అంబుదరనీల
స్థాణుః
ఆనందకంద
సర్వేశ్వర

ఇతి యమధర్మరాజుకృతహరిహర అష్టోత్తరశతనామావళి

## : ఐకమత్యసూక్తమ్ :

ఇది ఋగ్వేదముయొక్క పదవ మండలమునందలి 191వ సూక్తము. దీనిని ఐకమత్యసూక్తము, సౌమనస్య సూక్తము, సంజ్ఞానసూక్తము అను పేర్లతో వ్యవహరించుచున్నారు. ఋగ్వేదమునందలి చిట్టచివరి సూక్తమే ఈ ఐకమత్యసూక్తము. ఇందులో ముఖ్యముగా నాలుగు మంత్రములు ఉన్నవి. దీనికి ఋషి **ఆంగీరసుడు.** 1,2,4 మంత్రములు అనుష్టుప్ ఛందస్సులోను 3వ మంత్రము త్రిష్టుప్ ఛందస్సులోను కలవు. అందరిలో సమానప్రేమభావము ఉదయించి మానసికంగా, భౌతికంగా ప్రశాంతత నెలకొనును. ఈ సూక్త పారాయణ అమోఘమైనదని నిస్సంకోచముగా చెప్పబడినది. దీనిని గురు సమక్షమున అభ్యసించి భగవత్కృప పొందగలరు.

**01.** **సంసమిద్యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య ఆ ।**
**ఇళస్పదే సమిధ్యసే స నో వసూన్యా భర ॥**

**02.** **సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।**
**దేవాభాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥**

**03.** **సమానో మంత్రః సమితిః సమానీ సమానం మనః సహ చిత్తమేషామ్॥**
**సమానం మంత్ర మభిమంత్రయే వః సమానేన వో హవిషా జుహోమి॥**

**04.** **సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।**
**సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి ॥**

**॥ ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥**

**॥ ఇతి ఐకమత్యసూక్తమ్ ॥**

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

01. సమస్త సుఖములను శ్రేయస్సులను ప్రసాదించెడు ఓ అగ్నిదేవా! నీవు అందరిలో అంతర్యామిగా వ్యాపించి ఉండే ఈశ్వరుడవు. సమస్త ప్రాణులు ఐకమత్యంతో కలిసి యుండేటట్లుగా చేయుము. యజ్ఞవేదికపై నీవు (నెలకొని) జ్వలింపచేయబడెదవు. మాకు వివిధములగు ఐశ్వర్యములను ప్రసాదించెదవుగాక!

02. (ధార్మికవరేణ్యులారా!) మీరందరు కలిసికట్టుగా వెళ్ళండి. ఐకమత్యంతో ఉండండి. పరస్పరము ప్రేమభావముతో ముచ్చటించండి. మీ మనస్సులలో ఏకాభిప్రాయము నిలిచియుండుగాక! పూర్వకాలంలో ఉత్తమజనులు కలిసిమెలసి ఉంటూ జ్ఞానమును సంపాదించి భగవంతుని ఉపాసించినారు. అదేవిధముగా మీరుకూడా తమలో తాము ఏకమై విరోధ భావమును విడనాడి తమ కర్తవ్యమును నిర్వహింపుడు.

03. మనందరి యొక్క ప్రార్థన ఎట్టి భేదభావము లేకుండా ఏకాభిప్రాయము గలదై యుండుగాక! సభలు ఐక్యభావంతో నెలకొనుగాక! అంతఃకరణము-మనస్సులుసైతం ఒకేవిధమైన ఆలోచనలతో కూడియుండుగాక! అందరి హితమును కోరుతూ సమత్వభావముగల మంత్రములతో అభిమంత్రించి, అందరికోసం సామూహికమైన (ఉమ్మడి) ఆహుతులను సమర్పించెదను.

04. మీ అందరి సంకల్పములు ఒకేవిధముగా ఉండుగాక! మీ హృదయభావాలు ఒక్కటై ఉండునుగాక! అందరి మనస్సులు లేదా మానసిక ఆలోచనలు ఏకమై ఉండుగాక! తద్వారా మీ మధ్యన పరిపూర్ణమైన సామరస్యము ఐక్యభావము నెలకొని యుండుగాక!

త్రివిధములగు తాపములు శాంతించునుగాక!

**గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం - లోకాస్సమస్తాః సుఖినోభవన్తు**

**॥ సర్వం శ్రీఆంజనేయ చరణారవిందార్పణమస్తు ॥**

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।



రచయిత - సంకలన కర్త : మండపాక ఆంజనేయ మూర్తి,
భార్య: నాగవేంకట సూర్యప్రభ

మాతృమూర్తి : శ్రీమతి బుచ్చిరామలక్ష్మి గారు (1930-91)
పితృదేవులు : శ్రీ వీర్రాజు గారు (1919-1996)
(గోత్రం: మౌద్గల్యస; ప్రవర: ఆంగీరస, భారుమ్యాస, మౌద్గల్యస)
జననం: 30-03-1971 (విరోధికృత్-చైత్ర శుద్ధ చవితి, మంగళవారం)
స్వగ్రామం: విజయరామరాజుపేట, (వయా)వడ్డాది, విశాఖపట్నం జిల్లా

వివాహం : 09-02-2000, భార్య: నాగవేంకట సూర్యప్రభ
(శ్రీమతి యర్రమిల్లి నూకరాజేశ్వరి, శ్రీ యర్రంరాజు గార్ల కనిష్ఠ పుత్రిక)
(గోత్రం: శ్రీవత్సస; ప్రవర: భార్గవ, చ్యవన, అప్నవాన, ఔర్వ, జామదగ్న్య)

పుత్రుడు: పవన్‌కుమార్ రాజ్ (జననం: 15-12-2005)
మార్గశీర్ష శుద్ధ పౌర్ణమి, గురువారం (దత్తజయంతి)

సహోదరులు :

(1) సూర్యప్రకాశం (అబ్బాయి), (1952-1997)
(2) అప్పలనరసింహం(గారాలు),బ్రాంచి పోస్టు మాస్టర్, మేడివాడ, (వయా)రావికమతం,విశాఖ జిల్లా
(3) ఈశ్వర శ్రీనివాస సీతారామ ఆంజనేయులు(ఈశ్వరబాబు) (1967-'90)

శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై ఆంజనేయ।

శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ।

మొదటి క్రియాయోగ దీక్ష (30-03-2004) అనుగ్రహించిన గురువులు:
**యోగాచార్య ఆదిరాజు భవానీ శంకరశర్మ గారు**, సింహాచలం

రెండవ క్రియాయోగ దీక్ష (30-09-2007) అనుగ్రహించిన గురువులు:
**బ్రహ్మర్షి రాఘవానందనాయక్ గారు**, సంబల్‌పూర్

గురుపరంపర: **మహావతార్ బాబాజీ, లాహిరీమహాశయ, యుక్తేశ్వర్‌గిరి, పరమహంస యోగానంద, పరమహంస హరిహరానంద**

**చదువు:** బి.ఎ., పి.జి.డిప్లమో ఇన్ కంప్యూటర్ అప్లికేషన్స్
టైపు రైటింగ్: ఇంగ్లీషు-హైస్పీడ్, తెలుగు-హైయ్యర్

**వృత్తి:** సీనియర్ అకౌంటెంట్, కంప్యూటర్ ప్రోగ్రామర్
(రాజ్ కో సేల్స్&సర్వీసెస్, విశాఖపట్నం (1996-2009)

ప్రస్తుతం: 'గోవిందప్రియ' ఆధ్యాత్మికమాసపత్రిక
- డి.టి.పి., డిజైనింగ్, సర్క్యులేషన్ (2012 నుంచి)
**(శ్రీ భాష్యకార సిద్ధాంత పీఠం, భీమవరం**
**వ్యవస్థాపకులు: శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయర్ స్వామివారు)**

ప్రవృత్తి : ఆధ్యాత్మిక చింతన, పుస్తక పఠనం

ముద్రితము: అయ్యప్ప పూజా విధి (2004)

ప్రస్తుత సంకలనము: విశాఖనగర దేవతామూర్తుల చరిత్ర

శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ। శ్రీరామ జయరామ జయజయరామ జై అంజనేయ।

# మహోన్నత క్రియాయోగాచార్య గురుపరంపర



కల్పయోగి బాబాజీ మహారాజ్
( మహావతార్ బాబాజీ )



యోగిరాజ్ శ్యామచరణ్ లాహిరి
( లాహిరీ మహాశయ )



జ్ఞానావతార్
శ్రీయుక్తేశ్వర్‌గిరి మహారాజ్



ప్రేమావతార్
పరమహంస యోగానంద



కరుణావతార్
పరమహంస హరిహరానంద

